DEEN-E-HAQUE
(Telugu)



# సత్య ధర్మం

మూలం :

సయ్యిద్ అబుల్ ఆలా మౌదూదీ

అనువాదం :

ఎస్. ఎమ్. ఖాద్రి




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,
హైదరాబాద్-500 002

కరుణించేవాడు, కనికరించేవాడు అయిన అల్లాహ్ పేరుతో

# సత్యధర్మం

[ఇది 1943 మార్చి 21న జామియా మిల్లియా ఇస్లామియ ఢిల్లీలో మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది ఆ విశ్వవిద్యాలయం ఆచార్యులు, అధ్యాపకులు, విద్యార్థుల నుద్దేశించి చేసిన ప్రసంగం.]

## ఖుర్‌ఆన్ వాదన

ఖుర్‌ఆన్ మానవాళిని తాను బోధించే మార్గంవైపుకు ఆహ్వానిస్తూ చేసే బహిరంగ ప్రకటన స్వయంగా ఖుర్‌ఆన్ మాటల్లో ఇది :

"ఇన్నద్దీన ఇన్దల్లాహిల్ ఇస్లామ్"

ఈ చిన్న వాక్యమే నా ఈ ఉపన్యాసానికి ఇతివృత్తం, వివరాలకు పోయే అవకాశం లేనందున నేను మొదట క్లుప్తంగా దీని అర్థాన్ని విశదీకరిస్తాను. తద్వారా యీ వాక్యంలో ఏ విషయాన్ని గురించి ప్రకటించడం జరిగిందో బోధపడుతుంది. ఆ తరువాత ఈ ప్రకటనను స్వీకరించాలా? వద్దా? అనే ప్రశ్నను చర్చిద్దాము. చివరగా, ఒక వేళ ఈ ప్రకటనను స్వీకరిస్తే దానివల్ల మనపై తారసిల్లే బాధ్యతలేమిటో చర్చిద్దాము.

సాధారణంగా యీ వాక్యానికి సామాన్యమైన అర్థం ఈ విధంగా చెప్పడం జరుగుతుంది. "అల్లాహ్ దృష్టిలో నిజమైన మతం ఇస్లామ్ మాత్రమే." "ఇస్లామ్" అన్న దానికి సాధారణంగా ప్రజల్లో ప్రవారంలో ఉన్న భావం ఏమంటే ఇది ఒక మతం; అది 1300 ఏళ్ళక్రితం అరేబియా దేశంలో అవతరించింది. దీన్ని ప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) స్థాపించారు— ఇక్కడ "స్థాపించారు" అనే పదాన్ని నేను కావాలని ఎందుకు వాడానంటే కేవలం ముస్లిమేతరులే కాక చాలామంది ముస్లిములు— విద్యాధికులయిన ముస్లిములు కూడా— ప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను "ఇస్లామ్ వ్యవస్థాపకుడు" అని అంటారు. అలా రాస్తారు కూడా. అంటే వీరి దృష్టిలో, ప్రవక్త ముహమ్మద్ (సఅసం) చేత ఇస్లామ్ ప్రారంభమయిందన్న మాట. ఆయనే దాని వ్యవస్థాపకులన్న మాట.

ఈ కారణాలవల్ల ఒక ముస్లిమేతరుడు ఖుర్‌ఆన్‌ను అధ్యయనం చేస్తూ పైనుదహరించిన వాక్యం చదివి, ఏ విధంగానయితే ప్రతి మతం అదే సత్యమైన మతం అని, మిగిలిన మతాలన్నీ మిథ్యా మతాలని ప్రకటిస్తుందో, అదే విధంగా ఖుర్‌ఆన్ కూడా అది ప్రతిపాదించే మతాన్ని సత్యమయిందిగా ప్రకటిస్తోందన్న భ్రమకులోనయి టూకీగా దాటిపోతాడు. అలాగే ఒక ముస్లిమ్ యీ వాక్యాన్ని శ్రద్ధగా పరిశీలించే అవసరం అంతగా లేదని అనుకుంటాడు. ఎందుకంటే యీ వాక్యంలో ఏ మతాన్నయితే సత్యమయిందని ప్రకటించడం జరిగిందో దాన్ని తాను కూడా సత్యమయిందనే విశ్వసిస్తున్నాడు. ఒక వేళ దీన్ని గురించి ఆలోచించే ఊహే కలిగినా అది సామాన్యంగా కేవలం క్రైస్తవ మతం హిందూ మతం బౌద్ధమతం మరియు ఇలాంటి ఇతర మతాలతో ఇస్లామ్‌ను పోల్చి ఇస్లామ్ యొక్క సత్యతను నిరూపించాలన్న విషయాన్ని మాత్రమే సూచిస్తుంది. కాని వాస్తవానికి ఖుర్‌ఆన్‌లోని యీ వాక్యం చాలా ముఖ్యమయింది, ఖుర్‌ఆన్‌ను అర్థం చేసుకునే దృష్టితో అధ్యయనం చేసే వ్యక్తి ఈ వాక్యం చదివి, ఆగి పరిశీలించవలసిన అవసరం ఎంతయినా ఉంది. అంటే అంతకు

పూర్వం ఆ వాక్యాన్ని గురించి ఆలోచించిన దానికంటే అధికంగా ఆలోచించాలి.

ఖుర్‌ఆన్ చేసే ఈ ప్రకటనను అర్థం చేసుకునేందుకు "అద్దీన్" మరియు "అల్ ఇస్లామ్" అనే పదాల భావాల నిర్ధారణ జరగడం ముఖ్యం.

## అల్-దీన్ అంటే?

అరబ్బీ భాషలో "దీన్" అనే పదం అనేక అర్థాల్లో వాడ బడు తుంది. ఈ పదానికి ఒక అర్థం ఆధిక్యత, అధికారం అని వస్తుంది. రెండవ అర్థం విధేయత, దాస్యం అన్నది. మూడవ అర్థం ప్రతిఫలం, దేనికయినా బదులుగా ఇవ్వబడేది అని. నాల్గవ అర్థం విధానం, మార్గం అని వస్తుంది! ఈ వాక్యంలో దీన్ అనే పదం నాల్గవ అర్థం లోనే ప్రయోగించబడింది. అంటే దీన్ అనగా అనుసరించదగిన జీవిత విధానమని లేక ఆలోచన ఆచరణల వైఖరి అని భావం.

ఇక్కడ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఖుర్‌ఆన్ కేవలం దీన్ అని అనటం లేదు. "అల్ దీన్" (అద్దీన్) అని అంటుంది. "దీన్" మరియు అద్దీన్‌కు వున్న తేడా, ఇంగ్లీషులో This is a way అనే బదులు This is the way అంటే వచ్చే తేడా లాంటిది, అంటే ఖుర్‌ఆన్ ప్రకటన, "అల్లాహ్ దృష్టిలో ఇస్లామ్ ఒక జీవన విధానం" అని కాదు.

"ఇస్లామ్ మాత్రమే అల్లాహ్ దృష్టిలో (ఆమోదం పొందిన) వాస్తవమయిన, సరయిన జీవిత విధానం లేక ఆలోచన ఆచరణల వైఖరి" అన్నది.

దీనితోపాటు మరో విషయం గుర్తుంచాలి. ఖుర్‌ఆన్ ఈ పదాన్ని పరిమిత అర్థంలో ప్రయోగించదు. విస్తృతభావంలో ప్రయో గిస్తుంది. జీవన విధానం అంటే జీవితంలోని ఒక ప్రత్యేక రంగం లేక దాని ప్రత్యేక కోణం యొక్క విధానం కాదు. పూర్తి జీవితం

యొక్క విధానం. అలాగే, వేరువేరుగా ఒక్కొక్క వ్యక్తియొక్క వ్యక్తిగత జీవితం యొక్క విధానం మాత్రమే కాదు, అది మొత్తం మీద పూర్తి సమాజానికి సంబంధించిన విధానం కూడా. అది ప్రత్యేక దేశం, ప్రత్యేక జాతి లేక ప్రత్యేక కాలానికి చెందిన జీవిత విధానం కాదు. అది సర్వకాలాల్లో, సకల మానవాళి యొక్క వ్యక్తిగత మరియు సామూహిక జీవితానికి సంబంధించిన విధానం. దీన్నిబట్టి, ఖుర్‌ఆన్ చేసే ప్రకటనకు భావం, "పూజా పురస్కారాలు, పరలోక విశ్వాసం మరణానంతర జీవితం మొదలయిన భావనల సరయిన సంచయనం కూర్పు, అల్లాహ్ దృష్టిలో "ఇస్లామ్" అన్నది కాదు. అలాగే ఏ విధంగానయితే పాశ్చాత్య పరిభాషలో "మతం" అన్న దానికి ఒక నిర్వచనం చెప్పబడుతుందో ఆ భావంలో మానవుల మతపరమైన ఆలోచన, ఆచరణల నిజస్వరూపం ఇస్లామ్‌లోనే వుంది" అన్నది కూడా కాదు. అదేవిధంగా అరబ్బులకో లేక ఫలానా శతాబ్దం ప్రజలకో లేక ఫలానా కాలం వారికో— ఉదాహరణకు, పారిశ్రామిక విప్లవానికి పూర్వపు కాలం వారికోసమో ఉచితమైన జీవన విధానం ఇస్లామ్ అనే భావం కూడా సరయినది కాదు. వీటన్నింటికీ ప్రతికూలంగా చేసే విస్పష్టమయిన ప్రకటన ఏమిటంటే, సర్వకాలాల్లోనూ మానవాళి అంతా భువిపై జీవితం గడిపే ఒకే ఒక్క విధానం అల్లాహ్ దృష్టిలో సరి అయినది. ఆ విధానమే "అల్ ఇస్లామ్" అనబడుతోంది.

ఆసియా మరియు యూరపు నడుమనున్న ఒకానొక ప్రదేశంలో ఖుర్‌ఆన్‌కు ప్రత్యేక వ్యాఖ్యానం చేయబడిందని, దానిప్రకారం 'దీన్' అంటే భావం, కేవలం దైవం మరియు దేవుని దాసుని మధ్య వ్యక్తిగత సంబంధం వరకే పరిమితమని, నాగరికత మరియు రాజకీయ వ్యవస్థకు దానితో ఎలాంటి సంబంధం లేదని విని నేను చాలా ఆశ్చర్యపడ్డాను*

*1943లో టర్కీ నుండి ఓ పాత్రికేయుల ప్రతినిధివర్గం వచ్చింది. ఆ ప్రతినిధివర్గం నాయకుడు వెలిబుచ్చిన అభిప్రాయాలను యిక్కడ సూచించారు.

ఒకవేళ ఈ వ్యాఖ్యానం స్వయంగా ఖుర్ఆన్ నుండి గ్రహించి నదే అయితే ఆసక్తికరమైన విషయమే, కాని 18 సంవత్సరాల వరకు నేను పరిశోధనాత్మకంగా జరిపిన ఖుర్ఆన్ అధ్యయనం ఆధారంగా నిస్సంకోచంగా చెప్పగలను;

ఖుర్ఆన్ తన ఆధునిక వ్యాఖ్యాతల అభిలాషను ఖాతరుచెయ్యక "అద్దీన్" అనే పరిమిత భావంలో ప్రయోగించదు. దానికి భావం, సర్వకాలాల్లోను సర్వమానవులకు వారి పూర్తి జీవితానికి సంబంధించిన ఆలోచన, ఆచరణల వ్యవస్థ అనే చెబుతుంది.

## "అల్ ఇస్లాం" భావం

ఇక ఇస్లాం అనే పదాన్ని తీసుకుందాం, అరబ్బీ భాషలో యీ పదానికి అర్థం. లొంగిపోవడం, వంగటం, విధేయతను స్వీకరించడం, స్వయం సమర్పణ అని వస్తుంది. కానీ ఖుర్ఆన్ కేవలం ఇస్లామ్ అని అనదు. "అల్ ఇస్లాం" అని అంటుంది. ఇది దాని ప్రత్యేక పరిభాష. ఈ ప్రత్యేక పారిభాషిక పదానికి భావం ఇస్లాం అంటే దైవం ముందు ఒంగిపోవటం, ఆయన విధేయతను స్వీకరించటం, ఆయన సమక్షంలో తన స్వాతంత్ర్యాన్ని వదలుకోవడం, తనసుతాను ఆయనకు అర్పితం చేసుకోవడం అని. ఈ అర్పణం, అప్పగింతలకు ప్రకృతి సిద్ధాంతాలకు (Law of Nature) లొంగిపోవటం అని అర్థం కాదు. కొందరు దీని భావాన్ని పై విధంగా మలచడానికి ప్రయత్నం చేశారు, అలాగే, మానవుడు తన ఊహ ద్వారా లేక తన పరిశీలన అనుభవాల ద్వారా దేవుని అభీష్టం ఏమిటో, ఆయన ఆమోదం దేనికి లభిస్తుందో అన్ని విషయం గ్రహించి దాని ప్రకారమే నడుచు కోవడమని కూడా అర్థం కాదు. కొందరు పొరపాటున ఇలా కూడా అనుకున్నారు. ఇస్లాం లేక స్వయం సమర్పణ అంటే సరయిన అర్థం, దైవం స్వయంగా తన ప్రవక్తల ద్వారా మానవుల కొరకు ఏ ఆలోచన ఆచరణల విధానాన్నయితే బోధించాడో దాన్ని స్వీకరించడం, తన

ఆలోచన, ఆచరణల స్వేచ్ఛను— సరయిన పదాల్లో చెప్పాలంటే ఆలోచన, ఆచరణల విశృంఖలత్వాన్ని విడనాడి దైవం బోధించిన దాన్ని అనుసరించాలి, దాన్నే పాటించాలి.

ఈ విషయాన్నే ఖుర్‌ఆన్ "అల్ ఇస్లాం" అనే పదంతో నిర్వచిస్తుంది. వాస్తవానికి ఇది 1363 సంవత్సరాల క్రితం అరేబియాలో ముహమ్మద్ (సఅసం) స్థాపించిన సరికొత్త ధర్మం ఏమాత్రం కాదు. ఏరోజయితే ప్రప్రథమంగా మానవుడు భూమండలంపై దర్శనమిచ్చాడో ఆరోజే దైవం ఆ మానవునికి తెలిపాడు: "నీ కోసం కేవలం అల్ ఇస్లాం మాత్రమే సరియైన ఆచరణా విధానం" అని. దాని తర్వాత ప్రపంచంలోని వివిధ భాగాల్లో కాలానుగుణంగా ఏ ప్రవక్తలయితే దైవం నుండి మానవ మార్గదర్శకత్వంకోసం నియుక్తులయ్యారో వారందరి పిలుపు కూడా— ఎలాంటి మినహాయింపు లేకుండా – అల్ ఇస్లాం వైపుకే – దాని వైపుకే పివరిసారిగా ముహమ్మద్ (సఅసం) ప్రపంచాన్ని పిలిచారు.

మూసా(అలైహిస్సలాం) అనుచరులు ఆయన తరువాత ఇందులో ఎన్నో విభిన్న విషయాలను చేర్చి యూదత్వం అనే పేరుతో ఒక వ్యవస్థను, ఈసా (అస) అనుచరులు ఆయన తర్వాత క్రైస్తవం అనే పేరుతో మరో వ్యవస్థను, అదేవిధంగా భారతదేశం, ఈరాన్, చైనా మొదలయిన ఇతర దేశాల్లోని ప్రవక్తల అనుచరులు వివిధ మిశ్రమ కలుషిత వ్యవస్థలు ఇతర పేర్లతో నిర్మించుకున్నారన్నది వేరే విషయం. కాని మూసా (అస)గాని, ఈసా (అస) గాని మరియు అందరికీ తెలిసిన లేక తెలియని ఇతర ప్రవక్తలు (అస) గాని ఏ ధర్మాన్నయితే బోధించారో ఆ ధర్మం కేవలం అల్ ఇస్లాం తప్ప మరేదీ కాదు.

## ఖుర్‌ఆన్ ప్రకటన

ఈ వివరణను పరిశీలించిన తదుపరి ఖుర్‌ఆన్ చేసే ప్రకటన

ఏమిటో మన ముందు విస్పష్టంగా ప్రత్యక్షమవుతుంది. అదేమిటంటే మానవాళికై దైవం వద్ద కేవలం 'ఇదొక్కటే సరయిన విధానం .. ........

**"వారు దైవం ఎదుట విధేయతా వినమ్రతలతో తల ఒగ్గాలి' దైవం తన ప్రవక్తల ద్వారా ఏ మార్గం వైపుకు మార్గదర్శకత్వం చేశాడో ఆ ఆలోచన, ఆచరణల మార్గాన నడవాలి."**

ఇదీ ఖుర్ఆన్ ప్రకటన. ఈ ప్రకటనను స్వీకరించవలసిందేనా అన్న విషయం మనమిప్పుడు పరిశీలన జరపాలి. ఖుర్ఆన్ను స్వయంగా తాను చేసే ఈ ప్రకటనకు అది చూపిన ఆధారాలు నిదర్శనాలను పరిశీలించడం అవసరమే. కాని దానికి పూర్వం. ఈ ప్రకటన స్వీకరించడం తప్ప మనకు మార్గాంతరం ఏదయినా ఉందా అనే విషయాన్ని అన్వేషణ, పరిశీలనల ద్వారా తెలుసుకుందాం.

## 'జీవిత విధానం' ఆవశ్యకత

మానవునికి ప్రపంచంలో జీవితం గడపటానికి అతడు అవలంబించవల ఒక జీవన విధానం ఎట్టి పరిస్థితుల్లోనూ అవసరమే అనేది లోకవిదితం. భూమిపైనున్న ఎత్తుపల్లాల ప్రకారం తన మార్గాన్ని నిర్ణయించుకోడానికి మానవుడు జలప్రవాహం కాడు. అలాగే ప్రకృతి నిబంధనల ఆధారంగా పెరగటానికి అతడు ఒక వృక్షం కూడా కాడు కేవలం సహజ ప్రవృత్తి ఆధారంగానే జీవితం గడపడానికి మనిషి జంతువు కూడా కాడు. తన జీవితంలోని అధిక భాగంలో తానుకూడా ప్రకృతి చట్టాలకు దాసుడే ఐనప్పటికీ మనిషి జీవితానికి ఎన్నో కోణాలున్నాయి, వాటిలో నిర్దిష్టమైన మార్గం దొరకదు— జంతువుల్లా పరాధీనతతో వాటిపై అతను నడవడానికి, స్వయంగా ఇతడు ఒక మార్గాన్ని ఎన్నుకొని దాన్ని అవలంబించవలసి ఉంటుంది.

ప్రకృతి అతని ఆలోచించే మేధస్సు ముందు అతనికీ, విశ్వానికీ

సంబంధించిన అనేక సమస్యలను ఉంచుతుంది. కానీ వాటి పరిష్కారానికి విస్పష్టమయిన ఏ మార్గమూ సూచించదు. వాటిని పరిష్కరించేందుకు అతని ఆలోచనలకు ఓ మార్గం కావాలి. జ్ఞానేంద్రియాల ద్వారా అతని మనస్సుకు కొత్త విషయాలను అందజేస్తుంది. కాని వాటిని క్రమబద్ధంచేసి అప్పగించదు. వాటిని క్రమబద్ధం చేసుకోడానికి అతని జ్ఞానానికి ఓ మార్గం అవసరం. ప్రకృతి, అతని వ్యక్తిత్వం కోరే అనేక కోరికల్ని పూర్తిచెయ్యాలని కోరుతుంది; కాని వాటిని పూర్తిచేసుకునేందుకు ఎలాంటి సభ్యమయిన విధానాన్ని నిర్ణయించదు. ఈ విషయంలో వ్యక్తిగత నడవడికై అతనికి ఓ మార్గం కావాలి.

గృహజీవితం గడపడానికి, కుటుంబ సంబంధాలను మెరుగుపరచుకోటానికి, ఆర్థిక వ్యవహారాలకు, దేశ పరిపాలనకు మరియు అంతర్జాతీయ సంబంధాల కొరకు ఇంకా జీవితంలోని ఇతర రంగాల కొరకు కూడా ఒక మార్గం అవసరం. దానిపై మనిషి ఒక వ్యక్తిగానే కాక, ఒక సంఘంగా, ఒక జాతిగా, ఒక జీవరాశిగా కూడా నడువగలగాలి, తద్వారా ప్రకృతి సిద్ధంగా తనకు అవసరమయిన, వాంఛనీయమయిన లక్ష్యాలను సాధించగలగాలి ప్రకృతి ఐతే ఈ లక్ష్యాలనూ విస్పష్టంగా అతనిముందుంచలేదు, వాటిని చేరే ఓ మార్గమూ నిర్దిష్టంగా చూపలేదు.

## మానవ జీవితం అవిభాజ్యం

జీవితానికి సంబంధించిన ఈ వివిధ రూపాలకుగాను మనిషి ఏదో ఒక మార్గాన్ని అవలంబించడం అనివార్యం. ఐతే ఈ వివిధ రూపాలు స్వతహాగా సర్వస్వతంత్రమయిన, ఒక దానికొకటి ఆధారపడని రంగాలో విభాగాలో కావు. ఒక్కొదానికొరకు మనిషి వేర్వేరు మార్గాలు అవలంబించడానికి. ఇవి, వేర్వేరు దిశల్లో పొయ్యే, వేర్వేరు ప్రయాణ వసతులకు ఆధారపడిన, వేర్వేరు ప్రయాణ సాధనాలకు

యోగ్యమైన, వేర్వేరు ప్రయాణపు అవసరాలకు తగిన, వేర్వేరు గమ్యాలకు వేరే రంగాలు కావు. మొత్తం మీద "జీవితం ఒక్కటే" అని తెలుసుకోడానికి, మానవుడు మరియు మానవ జీవితం యొక్క సమస్యలనర్థం చేసుకోవడానికి చేసే విజ్ఞతతో కూడిన ఒక చిన్న ప్రయత్నం బాలు. జీవితం యొక్క ఒక భాగం ఇంకో భాగంతోను, ఒక రూపం ఇంకో రూపంతోను విడదీయరాని గట్టి సంబంధం కలిగి ఉంటుంది. ప్రతి ఒకటి మరొక దానిపై ప్రభావం వేస్తుంది, ప్రభావితమవుతుంది.

ఒకే రక్తం అందరి రక్తనాళాల్లోనూ ప్రవహిస్తూంది. ఒకే ఆత్మ అందరిలోనూ విలీనమయి వుంది. ఇవన్నీ కలసి మానవ జీవితం అనే దాన్ని తయారుచేస్తాయి. కాబట్టి ప్రస్తుతం మానవునికి అవసరమయినది జీవితం యొక్క లక్ష్యాలు కావు. ఒకే ఒక లక్ష్యం. దానికి లోబడే చిన్నా పెద్దా అన్ని లక్ష్యాలూ పూర్తిగా ఔచిత్యంతో తమ తమ స్థానాల్లో ఇమిడిపోవాలి. ఆ ఒక్క లక్ష్య సాధనలోనే తక్కినవన్నీ లభ్యమవ్వాలి.

మానవునికి అవసరమయినవి మార్గాలు కావు. ఒకే ఒక మార్గం. ఆ మార్గంపై మనిషి తన పూర్తి జీవితాన్ని, దాని సమస్త రూపాల సమేతంగా, పూర్తి సామరస్యంతో తన జీవిత లక్ష్యం వైపుకు తీసుకు పోగలగాలి. ఇతని ఆలోచనకు, విజ్ఞానానికి, సాహిత్యానికి, కళకు, విద్యకు, మతానికి. నైతికతకు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలకు న్యాయశాస్త్రానికి వేర్వేరు వ్యవస్థలు కాదు, ఒకే సమగ్ర వ్యవస్థ కావాలి. అందులో ఇవన్నీ సమరసంతో ఇమిడి వుండాలి. అందులో వీటన్నిటి కొరకు ఒకే నైజం, ఒకే గుణం కలిగివుండే సముచితమయిన సూత్రాలు వుండాలి, దాన్ని అనుసరించి మనిషి మరియు మనుషుల సమూహం, ఇంకా మానవాళి మొత్తం తన అత్యున్నత లక్ష్యం వరకు చేరగలగాలి.

జీవితాన్ని వేరు వేరు రంగాలుగా విభాగాలుగా విభజించవచ్చు అనే భావం ఉండే ఆ కాలం అజ్ఞానాంధకారంతో నిండిన కాలం.

ఇప్పుడు ఎవరయినా అలాంటి భావననే కలిగివుండి అలాంటి అర్థ రహితమయిన విషయాన్ని ప్రస్తావించేవారు వున్నారంటే వారు పాపం చిత్తపద్ధితో ఛాందస ఆలోచనల వాతావరణంలోనే జీవిస్తూవుండవచ్చు; అందువల్ల వారిపై జాలిగొనవలసిందే. లేదా ఈ దుర్మార్గులు నిజాన్ని పూర్తిగా గ్రహించి వుండే ఈ విధంగా మాట్లాడుతున్నారు. ఎందుకంటే ఏ ధర్మాన్ని* (దీన్‌ను) ఐతే వారు ఒక చోట ప్రవేశపెట్టాలని కోరుతున్నారో దాని సిద్ధాంతాలతో ఏకీభవించని వారికి "జీవితానికి సంబంధించిన మీకు ప్రేమపాత్రమయిన ఫలానా రంగాల్లో మీకు పూర్తి రక్షణ వుంటుంది"అని సంతృప్తిపరచడం వారికి ఎంతో అవసరం. వీరు చెప్పే ఈ రక్షణ నిజానికి హేతువు రీత్యా అసంభవం, ప్రకృతి రీత్యా నిషిద్ధం, ఆచరణాత్మకంగా అసాధ్యమయింది. ఇలా మాట్లాడే వారికి కూడా బహుశ ఇది అసాధ్యమయినదని బాగా తెలుసు. ఏ విధంగానయితే ఉప్పు గని దాని చుట్టూ వున్న ప్రతి వస్తువును ఉప్పుగానే మార్చివేస్తుందో అదే విధంగా ఆధిక్యతగల ప్రతి "ధర్మం లేక దీన్" జీవితరంగాలన్నింటినీ దాని నైజానికి, మౌలిక లక్షణానికి అనుగుణంగా మలచుకుంటుంది.

## భౌగోళిక విభజన, వర్ణ విభజన

మానవ జీవితాన్ని విభిన్న రంగాలలో విభజించటం ఎంత అసమంజసమో దాన్ని భౌగోళిక పరిమితుల్లో లేక వర్ణ పరిధుల్లో విభజించడం కూడా దానికన్నా అసమంజసం. మానవుడు నిస్సందేహంగా

* అంటే "జాతీయత" అనే మతం అన్నమాట. అందులో దైవం, గ్రంథం మరియు దైవ దౌత్యంతో సంబంధం లేకుండా కేవలం ప్రాపంచిక, భౌతిక ప్రాతిపదికలపై రాజ్యంలోని ప్రజలకోసం ఒక జీవన వ్యవస్థ నిర్మించబడాలి.

ప్రపంచంలోని వివిధభాగాల్లో నివసిస్తున్నాడు. ఈ భాగాల్ని నదులు, పర్వతాలు, అడవులు మరియు సముద్రాలు, అదే విధంగా కృత్రిమంగా మానవుడు ఏర్పరచుకున్న సరిహద్దులు వేరు చేస్తున్నాయి. అలాగే మానవుల్లో వేరు వేరు వర్ణాలు, జాతులు కూడా ఉన్నాయి. వాటి మధ్య చారిత్రకమయిన, మానసికమయిన ఇంకా ఇతరవిధాలైన కారణాలవల్ల మానవత ప్రగతి వికాసాలు వేరు వేరు రూపాలు ధరించాయి. కాని ఈ భేదాలను దృష్టిలో ఉంచుకొని, ప్రతి వంశానికి, ప్రతి జాతి మరియు ప్రతి భౌగోళిక జనాభా కొరకు వేరు వేరు "దీన్" (ధర్మం) లేక జీవన వ్యవస్థ కావాలనే వాడు పూర్తిగా అసమంజసమయిన మాట పలుకుతున్నాడు. ఇతని పరిమిత దృష్టి, పైన కనబడే చిహ్నాల భేదాల్లోనే చిక్కుకుపోయింది. బయటికి కనిపించే ఈ భిన్నత్వం అతను మానవత్వపు జీవమయిన ఏకత్వాన్ని గ్రహించలేక పోయ్యాడు. ఒకవేళ వాస్తవంగా ఈ విభేదాలకు అంత ప్రాముఖ్యత ఉండి, వాటి ఆధారంగా "దీన్" (ధర్మాలు) జీవన మార్గాలు వేర్వేరుగా ఉండాలి అనే సిద్ధాంతమే ఒప్పుకుంటే నేనొక ప్రతిపాదనను పెడుతున్నాను అలా చేసి చూడాలి:

రెండు దేశాలకు మధ్య రెండు జాతులకు మధ్యనున్న విభేదాలను మీ ఇష్టమొచ్చినంత అతిశయంతో వ్రాసిపెట్టుకోండి. అదే విధంగా స్త్రీ పురుషుల్లోను, ఒక మనిషికి ఇంకో మనిషికి, ఒక తల్లి గర్భంలోనే జన్మించిన ఇద్దరు పిల్లల మధ్యన ఉండే విభేదాలను కూడా శాస్త్రీయపద్ధతిలో పరిశీలించండి. మొదటి కోవకు చెందిన విభేదాల కంటే ఈ రెండవ కోవకు చెందిన విభేదాలే ఎంతసేపటికీ తీవ్రతరంగానే ఉంటాయి అనడం మాత్రం ఏ విధంగానూ అతిశయోక్తి కాదు. అలాంటప్పుడు ప్రతి వ్యక్తి జీవనవిధానం వేరుగానే ఉండాలని ఎందుకు అనకూడదు? కాని, వ్యక్తిగతమయిన, లైంగికమైన మరియు వంశపరమైన భిన్న

త్వాల్లో— ఏకత్వపు బలవత్తరమైన శక్తి గోచరిస్తుంది. దాని— ఏకత్వపు ఆధారంగా జాతి, దేశం, వర్ణం అనే భావనలు ఏర్పరచుకోవడం సాధ్యమవుతుంది. ఆ భావనల మూలంగానే ఒక జాతికి లేక ఒక దేశానికి చెందిన అత్యధిక ప్రజల కొరకు ఒకే ఒక జీవన మార్గం సాధ్యమే అన్న అభిప్రాయం కలుగుతుంది. ఐతే మానవత్వపు భావన ఏర్పడటానికి కావలసిన ఏకత్వపు శక్తి జాతిపరమయిన, వర్ణపరమైన లేక దేశ పరమైన భిన్నత్వాలకు మధ్య గోచరించక పోవడానికి కారణ మేమిటి? సకల భౌగోళిక, వర్ణపరమయిన మరియు జాతి పరమయిన విభేదాలున్నప్పటికి మానవుడు ప్రపంచంలో ఏ ప్రకృతి సిద్ధాంతాలకు లోబడి జీవిస్తున్నాడో అవన్నీ ఒకటే అన్నది యదార్థం కాదా? మానవ సృజనకు కారణమైన శారీరక నిర్మాణం కూడా ఒక్కటే. ప్రపంచంలో వున్న ఇతర జీవజాలానికి భిన్నమయిన ఓ ప్రత్యేకత, ఉనికిగల జీవ రాసి ఈ మనిషి అని నిరూపించే ప్రత్యేకతలు కూడా ఒక్కటే. మానవునిలో నిబిడీకృతమయిన, సహజమయిన కోరికలు, వాంఛలు కూడా ఒక్కటే. ఏ శక్తుల సమూహాన్నయితే మనం "మానవుడు" అని అంటామో అవన్నీ ఒక్కటే. మానవ జీవితంలో పని చేస్తున్న భౌతిక మానసిక, చారిత్రక. నాగరిక, ఆర్థిక శక్తులు కూడా ఒకటే.

ఇదే యదార్థమయితే—ఇది యదార్థం కాదని ఎవరనగలరు?— సిద్ధాంతాలు మనిషి, మనిషిగా శ్రేయ సంక్షేమాలు పొందగలగ ానికి సక్రమమయినవో అవి విశ్వజనీనమయి ఉండాలి. అవి వర్ణం, దేశం, జాతి అనే ప్రాతిపదికపై ఏర్పడే ఆస్కారమే లేదు. ఆయా వంశాలు, జాతులు ఈ సూత్రాలకు లోబడి తమ తమ ప్రత్యేకతలను ప్రదర్శించడంగాని, పాక్షికంగా తమ జీవన వ్యవహారాలను విభిన్న రీతుల్లో చక్కబరచుకోవడం గాని చెయ్యవచ్చు. అలా చెయ్యడం అవసరం కూడా. కాని మానవునికి, మానవునిగా ఏ ధర్మం లేక ఏ జీవన విధానం అవసరమో అది మాత్రం ఒక్కటే కావాలి. ఇంతకు, ఒక జాతికి సరయినది, సత్యమయినది అయిన విషయం ఇంకో జాతికి అది అసత్యమయినదవడం, ఒక జాతికి అసత్యమయిన విషయం

ఇంకో జాతికి సత్యమయినదవడం మానవ మేధస్సుకు మింగుడుపడని విషయమే.

## కాలానుగుణ విభజన

ఈ బుద్ధికందని విషయాల్లో— ఆధునిక యుగంలోని శాస్త్రీయమైన బుద్ధికందని విషయాల్లో— ఒకటేమిటంటే జీవితం యొక్క కాలానుగుణ విభజన. వాస్తవికత దృష్ట్యా ఇది ఎంతో అసంబద్ధమైన మాటయినా దీన్ని ప్రగాఢ విశ్వాసంతో ప్రవేశపెట్టడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అంటే ఏ జీవన వ్యవస్థనయితే ఒక కాలంలో సత్యమైనదో అది ఇంకో కాలంలో సత్యదూరమయిపోయింది. ఎందుకంటే వారి ప్రకారం జీవిత సమస్యలు వ్యవహారాలు ప్రతి కాలంలోనూ మారుతూ ఉంటాయి. ఒక జీవన వ్యవస్థ సత్యమయినదా, అసత్యమయినదా అనే విషయం పూర్తిగా ఆ కాలపు సమస్యలు మరియు వాటి వ్యవహారాల తీరుతెన్నులపైనే ఆధారపడి ఉంటాయి అని వారు భావిస్తారు. ఇదంతా ఈ మానవ జీవితం గురించి చర్చిస్తూ దీనితో పాటు పరిణామక్రమం గురించి కూడా తప్పక చర్చిస్తారు. ఈ జీవితపు చరిత్ర నిర్మాణంలో పనిచేసే నియమాలనూ వెదుకుతారు. దాని గత అనుభవాల ద్వారా వర్తమాన కాలానికి గుణపాఠం భవిష్యత్కాలానికి కావలసిన నియమనిబంధనలు అన్వయించుకోబడతాయి. ఈ మానవ జీవితానికిగాను ఒక "మానవ నైజం" అన్నది కూడా ఉన్నట్టు బుజావు చేయబడుతుంది. ఐతే నేనొక్కటి అడుగుతాను: "మీ వద్ద, మానవాళి యొక్క ఈ నిరంతర చరిత్రగతి మధ్యన కాలాన్ని, యుగాన్ని, కొలత వేసి చూపే కొలబద్ద ఏదయినా ఉందా? ఏవయినా కొలబద్దలుంటే వాటి సరిహద్దుల్లో ఒకదానిపై వ్రేలుంచి, దానికి అవలున్న జీవితసమస్యలు యీవలరాగానే పూర్తిగా మారిపోయాయని, మరియు ఆవల ఉన్న పరిస్థితులు ఈవల లేవని మీరనగలరా? ఒకవేళ మానవ చరిత్ర ఇలాంటి కాలానుగుణ విభజనల్లోనే భాగింపబడి వుంటే, గతిం

చిన చరిత్ర భాగం దాని తర్వాత వచ్చే చరిత్ర భాగానికి ఏమీ పనికి రానటువంటిది మరియు వ్యర్థమయినటువంటిది అని అనుకోవలసి వస్తుంది. ఆ భాగం గతించగానే ఆ కాల భాగంలో మానవుడు చేసిన కృషి అంతా వ్యర్థమయిపోతుంది. ఆ కాలంలో గడించిన అనుభవాలు తరువాతి కాలం వారికి ఎటువంటి గుణపాఠాలు కలిగి వుండవు ఎందుకంటే మానవుడు గతించిన ఏ విధానాలకై, ఏ సూత్రాల, ఏ విలువలకై కృషి చేసేందుకు ప్రయోగాలు చేశాడో ఆ పరిస్థితులు ఆ సమస్యలు నామరూపాల్లేకుండా పోయాయి కదా! ఐతే మధ్యలో ఈ పరిణామక్రమం చర్చ దేనికీ? ఈ జీవన సిద్ధాంతాల అన్వేషణ దేనికీ? చరిత్ర ద్వారా పరిష్కారాల అన్వయింపు దేనికీ? మీరు పరిణామం అని అన్నవెంటనే అక్కడ ఈ మార్పులన్నిటికీ మూలపదార్థమైన ఏదో ఒకటి ఉంది. అదే ఈ మార్పులో తనను తాను నిలబెట్టుకుంటూ నిరంతరం పురోగమిస్తోందన్న విషయాలు అనివార్యమవుతాయి. మీరు జీవన సిద్ధాంతాలపై చర్చ మొదలు పెట్టినట్టయితే ఈ అనిశ్చిత పరిస్థితుల్లో, పాదరసంలా నిత్యం మారే నిదర్శనల్లో సదా మారుతూవుండే ఈ స్వరూపాల్లో ఒక నిశ్చితమయిన మరియు జీవంగల యదార్థశక్తికూడా వుందని దానికి తన సొంత నైజం, తనవంటూ సొంత నియమాలూ వున్నాయని దానంతట అదే చెబుతోంది. ఇక మీరు చరిత్ర ద్వారో తార్కాణాలు వెదుకుతున్నారంటే దానికి అర్థం ఏమిటీ? చరిత్ర గతిలో బహు దూరాల నుండి ఎన్నో మజిలీలు దాటుకుంటూ పోతున్న ఆ బాటసారిని తనదంటూ ఓ వ్యక్తిత్వం, తనదంటూ సొంత నైజం ఉన్నవాడ్ని మీరు ఒప్పుకుంటున్నారన్న మాట, అతడు ప్రత్యేక పరిస్థితుల్లో ప్రత్యేకంగా వ్యవహరిస్తాడని, ఒకే సమయంలో కొన్ని వస్తువులను గ్రహిస్తాడని ఇంకో సమయంలో వాటిని తిరస్కరించి వేరే వాటిని కోరుతాడని చెప్పగలం.

ఈ జీవం గల యదార్థం; ఈ పరిణామానికి మూలపదార్థమైన నిశ్చిత పదార్థం; ఈ చరిత్ర గతి యొక్క నిరంతర బాటసారి— ఇతన్నే కదా మీరు “మానవత్వం” అని అంటారు? ఐతే ఒక మాట

అర్థం కాదు. మీరు, దారి, దాని మజలీలు, అందులో ఎదురయ్యే పరిస్థితులు వాటివల్ల జనించే సమస్యలను గురించి మాట్లాడేటప్పుడు మీరు ఆ మాటల్లోపడి కొట్టుకుపోతారు, కాని ఈ బాటసారినే మరచి పోతారు!

గమ్యాలు, వాటి పరిస్థితులు, వాటి సమస్యలు, మారిపోగానే బాటసారి, అతని వాస్తవికత కూడా మారిపోతుందా? ఇది నిజమా? ఒకటి మాత్రం గోచరిస్తూనే వుంది. ఆదికాలం నుండి నేటి వరకు అతని శరీర నిర్మాణంలో యెలాంటి మార్పు కలగ లేదు. వేనవేల సంవత్సరాల క్రితం వున్న భౌతిక మిశ్రమమే నేడూ అతనిలో వుంది. అతని నైజం కూడా అదే, అతని సహజమయిన కోరికలు కూడా అవే. అతని లక్షణాలు, ప్రత్యేకతలు కూడా ఆనాటివే. అతని ప్రకృతి, భావనలూ అవే. అతని శక్తిసామర్థ్యాలు అవే. అతని బలహీనతలు యోగ్యతలు కూడా అవే. అతను ఏదయినా పని చెయ్యడానికి లేక అతనిపై ఏదయినా పని జరగడానికి, అతడు ప్రభావం చూపడానికి లేక అతడే ప్రభావితుడవడానికి ఉన్న నియమాలు కూడా ఆనాటివే. అతనిపై పెత్తనం చెలాయించే శక్తులు కూడా అవే. అతడు నివసించే విశ్వ వాతావరణం కూడా అదే. వీటిలోని ఏ ఒక్కదానిలోనూ ప్రపంచం ప్రారంభం నుండి నేటి వరకు ఏమాత్రం వ్యత్యాసం ఏర్పడలేదు.

చరిత్రగతిలోని పరిస్థితులు మరియు వాటి ద్వారా జనించిన జీవన సమస్యల మార్పువల్ల స్వయంగా మానవత్వం కూడా మారుతూ వచ్చింది లేక మానవత్వంతో పాటు ఉన్న మౌలిక పదార్థాలు కూడా మారుతూ వచ్చాయని చెప్పగలిగే సాహసం ఎవ్వరికీ లేదు. ఐతే యథార్థం ఇదే ఐనప్పుడు, మానవునికి నిన్న అమృతమయమయినది నేడు గరళంగాను నిన్న సత్యమయినది నేడు అసత్యంగాను, నిన్న

విలువైనది నేడు విలువలేనిది గాను మారిందని చేసే ప్రకటనకు ఏమాత్రం విలువ ఉంది?

## ఎలాంటి జీవనవ్యవస్థ కావాలి?

వాస్తవమేమంటే, వ్యక్తులు, సమాజాలు, చరిత్రగతిలో మానవ త్వాన్ని దానితో సంబంధం గల, మౌలిక విషయాలను అర్థం చేసుకోవడంలో పొరబడటం జరిగింది. కొన్ని యదార్థాలను ఒప్పుకోవడంలో అతిశయానికిపోయి, ఇంకా కొన్నిటిని లోపభూయిష్టంగా గుర్తించడం జరిగింది, ఫలితంగా కాలానుగుణంగా అవలంబిస్తూ వచ్చిన జీవన వ్యవస్థలను సకల మానవాళి అనుభవం తరువాత తప్పయినవిగా భావించింది. వాటిని వదిలేసి వాటి స్థానంలోనే అలాంటివే వేరే వ్యవస్థల కోసం ఖాళీని కల్పించడం అనివార్యమయింది. ఈ గాథను పరిశీలించిన తరువాత గ్రహింపబడిన ఫలితమేమంటే, మానవాళికై ప్రతికాలంలోనూ తప్పనిసరిగా ఒక జీవనవ్యవస్థ కావాలి. అది కేవలం ఆ కాలంలోని పరిస్థితుల మరియు సమస్యల్లోనుండే ఉద్భవించాలి. వాటినే పరిష్కరించే యత్నం చేయాలి. వాస్తవానికి ఈ మానవ చరిత్ర గాథ ద్వారా ఏదయినా ఆరోగ్యవంతమయిన ఫలితాన్నే గ్రహించాలంటే అది సాధ్యమే. అదేమిటంటే, ఇలాంటి కాలానుగుణమయిన జీవన వ్యవస్థలను (ఇంకో విధంగా చెప్పాలంటే యీ పుట్టగొడుగుల్లాంటి వ్యవస్థలను) మాటిమాటికి ప్రయోగించి ప్రతి వైఫల్యం తరువాత ఆ స్థానంలో ఇంకో దాన్ని ప్రయోగించడంలో మానవాళి యొక్క సమయం బహుథా వ్యర్థమవుతుంది. ఈ పరీక్షల్లోనే మానవత్వపు ప్రగతి కుంటుపడుతుంది, దాని వృద్ధీ వికాసాలు, అది పరిపూర్ణత వైపుకు చేసే పురోగమనంలో తీవ్రమయిన ఆటంకాలు ఏర్పడతాయి. అందువల్ల మానవతకు అత్యంత ముఖ్యంగా కావలసిందేమిటంటే, మానవాళిని, దానికి సంబంధించిన సకల యదార్థాలను తెలుసుకొని దాన్ని విశ్వజనీనమయిన పటిష్ఠవంతమయిన సూత్రాలపై

నెలకొల్పబడే జీవనవ్యవస్థ. ఆ వ్యవస్థ ద్వారా అతడు వర్తమానం మరియు భవిష్యత్కాలాలలో సయితం మార్పుచెందే పరిస్థితుల నుండి క్షేమంగా దాట గలగాలి. వాటివల్ల ఉద్భవించే సమస్యలను పరిష్కరించగలగాలి. జీవిత మార్గంపై ఈడ్చుకుంటూ కాదు, సునాయాసంగా పరుగులుతీస్తూ గమ్యం వైపుకు పురోగమించగలగాలి.

## మానవుడే నెలకొల్పుకోగలడా?

మనిషికి కావలసిన జీవిత విధానం లేక జీవనవ్యవస్థ లేక 'దీన్' ఎలా ఉంటుందో పరిశీలించాము. అయితే దైవ సహాయం లేకుండా మానవుడు స్వయంగా తన కోసం ఇలాంటి 'దీన్'ని నెలకొల్పుకో దలిస్తే ఈ ప్రయత్నంలో అతను సఫలీకృతుడు కాగలడా? అనే విషయాన్ని ఇక పరిశీలించాలి. మానవుడు స్వయంగా ఇలాంటి జీవన వ్యవస్థను నిర్మించడంలో ఇంతవరకు సఫలీకృతుడయినాడా? లేదా అనే ప్రశ్నను మీ ముందుంచను. ఎందుకంటే దానికి జవాబు ఖచ్చితంగా "లేదు" అనే వస్తుంది. నేడు గొప్ప గొప్ప ఉద్ఘోషణలతో తమ తమ జీవనవ్యవస్థలను (ధర్మాలను) ప్రవేశపెట్టేవారు, వాటి కోసం పరస్పరం కీచులాడుకునేవారు కూడా తాము ప్రవేశపెడుతున్న ధర్మాలు, మానవునికి ఓ పరిపూర్ణ మానవుని రూపంలో అవసరమైన "అద్దీన్" అవసరాలను నెరవేర్చగలుగుతాయని ప్రకటించలేరు. ఒకరి జీవనవ్యవస్థ లేక ధర్మం "వర్ణ" పరమయినదీ "జాతి" పరమయినదైతే మరొకరి "దీన్" భౌగోళికమయినది, ఇంకొకరి ధర్మం వర్గ సంబంధమయినది, మరొకరి ధర్మం గతించిన నిన్న మొన్నటి కాలపు అవసరాలను తీర్చడానికే పరిమితమయినది. రాబోయే కాలపు పరిస్థితులకు, సమస్యలకు అది ఉపకరిస్తుందా లేదా అని ఖచ్చితంగా ఇప్పుడే చెప్పడం కష్టం. ఎందుకంటే గతించిన కాలం యొక్క

చారిత్రక ఫలితాలను సమీక్షించవలసి ఉంది. కాబట్టి మానవుడు ఇటువంటి ధర్మాన్ని లేక "అద్దీన్"ని నెలకొల్పడంలో సఫలీకృతుడయ్యాడా అనడగను. నేనడిగేది మనిషి సఫలీకృతుడవడం కూడా సాధ్యమా? అని మాత్రమే.

ఇది ఎంతో ముఖ్యమైన ప్రశ్న, దీన్ని స్థూలంగా చర్చించడం భావ్యం కాదు. ఇది మానవ జీవితానికి సంబంధించిన నిర్ణయాత్మకమయిన ప్రశ్నల్లో ఒకటి. అందువల్ల బాగా అర్థం చేసుకోండి. మనం దేన్నయితే నెలకొల్పాలని అనుకుంటున్నామో అది ఏమిటి? ఎవరైతే దీన్ని నెలకొల్పగలరో లేరో అని ప్రశ్నిస్తున్నామో ఆ వ్యక్తి లేక వ్యక్తుల శక్తిసామర్థ్యాలు, యోగ్యతలు ఏవి?

## "అద్దీన్" స్వరూపం

మానవునికి ఏ "అద్దీన్" పరిపూర్ణ జీవనవ్యవస్థ లేక ధర్మం అవసరమని నేను ఋజువు చేశానో, దానికి భావం ఏదయినా సవివరమయిన నియమావళి అని కాదు. అందులో ప్రతి కాలానికి గాను, అన్ని పరిస్థితులకు గాను చిన్న పెద్ద వివరాలన్నీ ఉండాలనీ అర్థం కాదు. దాన్ని పొందిన తర్వాత మనిషి పని కేవలం దాని ప్రకారం ఆచరించడం మాత్రమే అనే భావం కూడా కాదు, వాస్తవానికి దాని భావమేమంటే, అది సర్వతోముఖమయిన, సార్వకాలికమైన శాశ్వతమైన సూత్రాలుగా ఉండాలని. అది అన్ని పరిస్థితుల్లోను మానవునికి మార్గదర్శకత్వం వహించగలగాలి, అది అతని దృష్టికి, ఆలోచనకు, ప్రయత్నాలకు, కృషికి, పురోగమనానికి సరయిన దిశను నిర్ణయించగలగాలి. అవి అతన్ని తప్పుడు ప్రయోగాల్లో కాలాన్ని, శ్రమను, శక్తిని వ్యర్థం చేయకుండా కాపాడగలగాలి, ఈ లక్ష్యం కొరకు మానవునికి ప్రథమంగా జ్ఞానం— ఊహలు, భ్రమలూ కావు వాస్తవజ్ఞానం —అవసరం. తద్వారా అతనికి తన గురించి, ఈ విశ్వం గురించి యదార్థం ఏమిటో, విశ్వంలో తన స్థానం ఏమిటో తెలియాలి. అలాగే

అతను మరో విషయం తెలుసుకోవడం— అనుకోవడం, అభిప్రాయ పడటం కాదు తెలుసుకోవడం— అవసరం; ఈ జీవితం కేవలం ఈ ప్రపంచం మట్టుకే పరిమితమయినదా? లేక ఇది అసలు జీవితం యొక్క తొలి భాగమా? ఈ జీవన పయనం కేవలం జననం నుండి మరణం వరకేనా లేక ప్రయాణం మొత్తంలో ఒక మజలీ మాత్ర మేనా? అని.

ఇంకా దీని కొరకు, మానవునికై జీవిత లక్ష్యం ఒకటి నిర్ణయ మవ్వాలి. అది వాస్తవంగానే— కేవలం కోరికల ఆధారంగా కాదు — మానవ జీవిత పరమార్థం అయి ఉండాలి. అది మానవ సృజనకు మూల కారణమై ఉండాలి. దానితో ప్రతి వ్యక్తి, ప్రతి మానవ సమూహం, మొత్తానికి యావత్తు మానవాళి లక్ష్యాలు సామరస్యం చెందగలగాలి— సర్వకాలాల్లోనూ ఎలాంటి సంఘర్షణలకు తావులేకుండా సమన్వయం చెందాలి.

మనిషికి నైతికతకు సంబంధించిన పటిష్ఠమయిన సర్వతోముఖ మయిన సూత్రాలు కావాలి. అవి అతని ప్రకృతి యొక్క ప్రత్యేకత లన్నింటితో సానుకూలత కలిగినవై ఉండాలి. ఎలాంటి అవసర పరిస్థితుల్లోనయినా సైద్ధాంతికంగాను ఆచరణాత్మకంగానూ అన్వ యించగలిగినవై ఉండాలి. అప్పుడే అతను ఈ సూత్రాల ఆధారంగా తన స్వరూప స్వభావాలను నిర్మించుకో గలుగుతాడు. ఈ సూత్రాల వెలుగులోనే అతను తన జీవిత పయనంలోని ప్రతి దశలోను, దాని అన్ని పరిస్థితుల్లోను ఎదురయ్యే సమస్యలను పరిష్కరించుకో గలుగు తాడు. లేకపోతే మారే పరిస్థితులు మరియు సమస్యలకు అనుగుణంగా సూత్రాలను నిర్మించుకుంటూ, మార్చుకుంటూ వుండే ప్రమాదానికి గురి కాగలడు. ఇంకో విధంగా చెప్పాలంటే ఇలా మార్చుకుంటూ పోవడం వల్ల మనిషి ఎలాంటి సూత్రం సిద్ధాంతం లేనివాడుగా (Charecter less) ఉత్త అవకాశ వాది (Mere Opportunist) గా తయారవడన్న మాట.

మానవ సమాజం యొక్క యదార్థాన్ని, దాని లక్ష్యాన్ని, దాని సహజమయిన అవసరాలను తెలుసుకొని నిర్మించబడిన సమగ్రమైన సర్వతోముఖమయిన నాగరికతా సూత్రాలు మనిషికి అవసరం. వాటిలో ఎలాంటి తీవ్రవాదం గాని, హెచ్చు తగ్గులుగాని, సమతూక రాహిత్యం గాని ప్రవేశించరాదు. వాటిలో మానవులందరి ఉమ్మడి శ్రేయాన్ని దృష్టినందుంచుకోవడం జరగాలి. వాటిని అనుసరించి ప్రతి కాలంలోను మానవ జీవితంలోని ప్రతి రంగాన్ని రూపొందించడానికి, నిర్మించడానికి, వృద్ధిపరచడానికి కృషి చెయ్యడం సాధ్యపడాలి. అదేవిధంగా మనిషికి, అతని వ్యక్తిగత శీల నిర్మాణం, సామూహిక వైఖరి, వ్యక్తిగత సామూహిక కృషి ఆచరణల కొరకు సమగ్రమయిన హద్దులు అవసరం. అవి ఈ జీవితపు రాచబాటపై, మార్గ చిహ్నాలుగా ఉపకరించాలి. అవి ప్రతి మలుపులోను, ప్రతి కూడలిలోను, ప్రతి ప్రమాదభరితమయిన దశలోను అతన్ని హెచ్చరించి "నీ మార్గం అటు కాదు, ఇటూ" అని సూచించగలగాలి.

మనిషికి ఆచరణాత్మక నియమాలూ అవసరం. అవి వాటి స్వరూప స్వభావాలరీత్యా శాశ్వతమయినవిగా, విశ్వజనీన అనుసరణకు యోగ్యమయినవిగా వుండాలి. అవి మానవ జీవితాన్ని ఈ అద్దీన్‌లో నిర్ణయించబడిన అసలు వాస్తవికతతో, జీవిత పరమార్థంతో, జీవిత లక్ష్యంతో, నైతిక సూత్రాలతో, నాగరికతా నియమాలతో ఆచరణ పరిధులతో నిత్యం ముడివడి వుండేలా చెయ్యాలి.

ఇదీ మనిషికి కావలసిన వ్యవస్థ. దీన్ని నెలకొల్పే ప్రశ్న నే మనం చర్చిస్తున్నాం. ఇప్పుడు కాస్త గమనించాలి. మానవుడు తన కోసం ఇలాంటి "అద్దీన్"ని నిర్మించుకోడానికి అతని వద్ద కావలసిన సాధన సూత్రాలు ఉన్నాయా?

## మానవునికి సాధనాలు

మనిషి దగ్గర తన "దీన్"ను లేక జీవిత విధానాన్ని నిర్మించు

కోడానికి సాధనాలు లేక మార్గాలు నాలుగు కంటే ఎక్కువగా లేవు. అవి : 1. వాంఛ, 2. మేధ, 3. పరిశీలన, అనుభవం, 4. గత అనుభవాల చారిత్రక భోగట్టా. 

ఈ నాలుగు మార్గాలు తప్ప ఐదవ దాన్ని బహుశ సూచించడం దుర్లభం. ఈ నాలుగింటినీ సాధ్యమైనంతవరకు పరిపూర్ణంగా పరిశీలించి "అదీన్" నిర్మాణంలో ఇది మానవునికి ఎంతవరకు సహాయపడతాయనే విషయాన్ని తెలుసుకోవాలి. నేను నా జీవితం యొక్క చాలా భాగం ఈ పరిశోధనలోనే గడిపాను. చివరికి ఈ సాధనాలు "అద్దీన్" నిర్మాణంలో మాత్రం ఎలాంటి సహకారాన్ని అందించలేక పోయినా మానవేతర మార్గదర్శకుడు ఎవరయినా ఈ "అద్దీన్"ను అందజేసినట్లయితే దాన్ని అర్థం చేసుకోవడానికి, పరీక్షించటానికి, గుర్తించటానికి మరియు తదనుగుణంగా జీవితం యొక్క వివరమయిన వ్యవస్థను అవసరమయినప్పుడల్లా నిర్మించుకోడానికి మాత్రం తప్పక సహాయపడతాయని తెలుసుకోగలిగాను.



## వాంఛ

మొదట వాంఛను తీసుకోండి. ఇది మానవునికి మార్గాన్ని చూపెట్టగలదా? ఈ కోరిక అనేది మానవునిలో అసలైన ఆచరణకై ప్రేరకసాధనమే ఐనప్పటికీ దీని నైజంలోగల బలహీనతల కారణంగా ఇది మార్గదర్శకత్వానికి ఏమాత్రం యోగ్యత కలిగిలేదు. ఇది ఒంటరిగా మార్గం చూపడం అలా ఉంచి తరచు బుద్ధిజ్ఞానాలను కూడా పెడత్రోవ పట్టించింది. సుశిక్షణ ద్వారా దీన్ని ఎంత సంస్కారవంతంగా తీర్చిదిద్దినా చివరి తీర్పుపై వదలి వేసినప్పుడు దీన్ని వదలనిచ్చే భారం తొంభయి తొమ్మిది పాళ్ళు ఇది వక్రమయిన తీర్పునే ఇస్తుంది. ఎందుకంటే దీనిలోని అవసరాలు సరైన తీర్పుకు బదులు తమకు కావలసిన దాన్ని ఏదో విధంగా త్వరగా మరియు సునాయాసంగా ప్రాప్తమయ్యే

విధంగానే తీర్పును చేయిస్తాయి. ఇది మానవ వాంఛలోని సహజ బలహీనత. ఒక వ్యక్తి వాంఛ ఐనా, ఒక వర్గం వాంఛ ఐనా లేక రూసో చెప్పిన ప్రజావాంచ (General Will) ఐనా, ఏ రకపు మానవ వాంఛ ఐనా దానికి సహజంగా "అద్దీన్"ను నిర్మించేందుకు సహాయపడే సామర్థ్యం లేదు. పోగా, మానవ జీవితపు యదార్థం, దాని పరమార్థం, దాని మూలికారణం లాంటి ఉన్నతమయిన సమస్యలను (Ultimate Problems) పరిష్కరించడానికి అది ఏ విధంగానూ తోడ్పడజాలదు.

## మేధ

రెండవ సాధనం మానవ మేధను చూద్దాం. దీని సకల ఉత్తమ సామర్థ్యాలు మనం ఒప్పుకుందాం. మానవ జీవితంలో దీని ప్రాముఖ్యతను కాదనలేం. ఇంకా ఇది మనిషిలో వుండే మహా గొప్ప మార్గదర్శక శక్తి అన్న విషయమూ ఒప్పుకోవలసిందే. ఐతే "అద్దీన్"ను తయారు చేసేది ఎవరి మేధస్సు? రామునిదా? భీమునిదా? లేక మానవుల ప్రత్యేక వర్గం వారిదా? ఈ కాలం ప్రజలదా? లేక పూర్వీకులదా? లేక భావిలో పుట్టే వారి మేధస్సా? అనే ప్రశ్నను అలా వదిలేద్దాం. అసలు ప్రశ్న స్వయంగా మానవ మేధ పరిధుల్ని పరిశీలించి, "అద్దీన్" నిర్మాణంలో దాన్ని నమ్మటానికి వీలుందని చెప్పగలమా? అన్నదే. ఈ మానవ మేధ ఇచ్చే తీర్పులు కేవలం జ్ఞానేంద్రియాలు అందజేసే సమాచార సామగ్రిపైన్నే ఆధారపడి ఉంటాయి. ఈ జ్ఞానేంద్రియాలు ఒకవేళ తప్పుడు సమాచారాన్ని అందజేస్తే ఇది తప్పుడు తీర్పునే చేస్తుంది. అవి లోపభూయిష్టమైన సమాచారాన్ని అందజేస్తే తీర్పు కూడా లోపభూయిష్టంగానే ఉంటుంది. ఏ విషయంలోనయితే అవి ఎట్టి సమాచారాన్ని అందజెయ్యవో వాటిలో ఇది ఆత్మజ్ఞానంగలదయితే ఎలాంటి తీర్పునూ వ్వదు. ఒకవేళ ఇది వక్రమయిందయితే గుడ్డిగానే నలువైపులా

అంచనాల బాణాలు విసురుతుంది. పాపం, ఇన్ని పరిమితులకు లోనయి ఉన్న మానవ మేధకు మానవ కళ్యాణానికి పనికివచ్చే "అద్దీన్"ను నిర్మించే అర్హత ఎక్కడిది? అద్దీన్ నిర్మాణం ఏ ఉన్నత సమస్యల్ని పరిష్కరించడంపై ఆధారపడివుందో వాటికి సంబంధించిన విషయసామగ్రిని జ్ఞానేంద్రియాలు ఏ విధంగానూ సమకూర్చజాలవు. అలాంటప్పుడు ఈ సమస్యల్ని ఊహాగానాల ద్వారా, అంతం కాని అంచనాల ద్వారా కేవలం భ్రమల ద్వారా పరిష్కరించడం జరుగుతుందా? అద్దీన్‌ని నిర్మించటానికి ఏ శాశ్వత నైతిక విలువలను నిర్ణయించడం అనివార్యమో వాటి కొరకు జ్ఞానేంద్రియాలు అతి లోపభూయిష్టమయిన సమాచారాన్ని అందజేస్తాయి. ఐతే మానవ మేధ ఈ లోపభూయిష్టమయిన సమాచారం ఆధారంగా పరిపూర్ణమయిన నైతిక విలువల్ని రూపొందించగలదా? ఇలాగే మనం లోగడ "అద్దీన్"కు కావలసిన అంశాలను పరిశీలించాము. వాటిలో ఏ అంశానికి కూడా మానవ మేధ సమగ్రమయిన, సంపూర్ణమయిన వ్యవస్థను నిర్మించడానికి జ్ఞానేంద్రియాలు సవ్యమయిన, పరిపూర్ణమైన సమాచారాన్ని అందించలేవు. దీనికి తోడుగా మేధస్సుకు "వాంఛ" అనేది సతతం జోడుగా వుంటుంది. మేధ హేతుబద్ధమయిన తీర్పులు ఇవ్వకుండా వాంచ వారిస్తూ వుంటుంది. దాని గమనాన్ని కొంతైనా వక్రత వైపుకు మరల్చుతూ ఉంటుంది. కనుక ఒకవేళ జ్ఞానేంద్రియాలు అందజేసిన మూలపదార్థాన్ని సద్వినియోగం చేసుకోవడంలో దాని కూర్పులోను దాని ద్వారా అర్థాన్ని గ్రహించడంలోను మేధ తప్పు చెయ్యదని కాస్సేపటికి ఒప్పుకున్నా దానికున్న బలహీనతల కారణంగ ఇంత గొప్ప కార్యభారం దానిపై మోపటం దానిపై జులుం చెయ్యడమే. దానితోపాటు స్వయంగా మనపై కూడా అది జులుమే అవుతుంది.

## సైన్స్

మూడవదాన్ని తీసుకోండి. అంటే పరిశీలన అనుభవాల ద్వారా

లభించే జ్ఞానం అన్న మాట. అదే శాస్త్రీయ విజ్ఞానం లేక సైన్స్. ఈ విజ్ఞానం యొక్క విలువను గొప్పతనాన్ని ఒప్పుకోవడంలో నేను ఏ విద్యార్థికీ తీసిపోను. దీన్ని ఏ మాత్రమైనా చులకన చేసినా సహించను. కాని దీనికున్న దీని పరిమితులను దృష్టిలో ఉంచుకోకుండా లేని విస్తృతను దీనికి అంటకట్టడం నా దృష్టిలో శాస్త్రీయ పద్ధతి కాదు. మానవ జ్ఞానం అంటే ఏమిటో తెలిసిన వారెవరూ దీన్ని కాదనరు. ఉన్నత సమస్యల మూలం వరకు ఇది ఏ విధంగాను చేరజాలదు. కారణం ఏమంటే, మానవునికి ఈ సమస్య మూలానికి చేరే సాధనాలు ప్రాప్తం కాలేదు. మానవుడు నేరుగా ఈ అసలు సమస్యను పరిశీలించలేడు. సరికదా పరిశీలన, ప్రయోగాల పరిధిలో వచ్చే ఏ విషయాల ద్వారానయినా సహేతుకంగా ఆలోచించి, ఆ సమస్యల మూలం గురించి 'విజ్ఞానం' అనిపించగల ఏ నిర్ణయానికీ రాలేడు. కాబట్టి అద్దీన్ నిర్మాణానికి ప్రథమంగా ఏ సమస్యల పరిష్కారం కనుగొనడం అనివార్యమో అవి ఈ విజ్ఞానం పరిధికి పూర్తిగా అతీతమయినవని తేలిపోయింది. ఇకపోతే నైతిక విలువలు, నాగరికత నియమాలు, మానవాళిని అపమార్గాల నుండి తప్పించే హద్దులను నిర్ణయించే పని విజ్ఞానానికి వదిలిపెట్టవచ్చా లేదా అనే విషయం చర్చించాలి. ఐతే ఈ పనిని, ఏ వ్యక్తి, ఏ వర్గం లేక ఏ కాలం వారి జ్ఞానంపై ఆధారంగా నెరవేర్చాలి, అనే చర్చను వదిలేసి, వైజ్ఞానికంగా ఈ సమస్యను పరిష్కరించటానికి అనివార్యమైన నిబంధనలు లేక షరతులు ఏవో తెలుసుకోవడం అవసరం. దీనికి కావలసిన మొదటి షరతు, మానవుడు ప్రస్తుతం ఈ ప్రపంచంలో జీవితం గడుపుతున్న ప్రకృతి నియమాల జ్ఞానం కలిగి ఉండటం. రెండవ షరతు, స్వయంగా మానవ జీవితానికి సంబంధించిన వైజ్ఞానిక విషయాలు పరిపూర్ణమై ఉండటం. మూడవ షరతు, పై రెండు రకాల జ్ఞానాల్లో అంటే ప్రకృతికి సంబంధించిన మరియు మానవులకు సంబంధించిన జ్ఞానా

లను కలిపి ఒక పరిపూర్ణ మేధగా వీటిని సమన్వయపరచి వీటి ద్వారా సరయిన నిర్ణయాలు గైకొని మానవుని కొరకు నైతికపు విలువలను, నాగరికతా సూత్రాలను, మానవాళిని అపమార్గాన్నుండి తప్పించేటటు వంటి హద్దులను నిర్ణయించాలి. పైన పేర్కొన్న షరతులు నేటికి పూర్తి కాలేక పోయాయి, ఇంకా ఐదు వేల ఏండ్ల తరువాత ఐనా పూర్తి ఔతాయనే నమ్మకం కూడా లేదు. పూర్తి మానవత్వ పతనానికి ఒక్కరోజు ముందు ఇవి పూర్తి ఔతాయేమో! చెప్పలేం. కాని అప్పుడు వాటి ప్రయోజనం ఏమిటి?

## చరిత్ర

చివరిగా మానవ అనుభవాల చారిత్రక భోగట్టా లేక మానవాళి యొక్క "కర్మపత్రం" అనబడే సాధనాన్ని పరిశీలిద్దాం. చరిత్ర యొక్క ప్రాముఖ్యత మరియు దాని ప్రయోజనాలను నేను కాదనను. "అద్దీన్"ను నిర్మించే మహోన్నత కార్యాన్ని నిర్వహించటానికి ఇది కూడా సరిపోదు అని మాత్రం నేను గట్టిగా చెప్పగలను. కాస్త పరిశీలించి మీరూ ఒప్పుకుంటారు. ఈ రికార్డు పూర్వుల నుండి మన వరకు సక్రమంగా, సమగ్రంగా, సవ్యంగా, యథాతథంగా చేరిందా? అని నేను ప్రశ్నించను. ఈ రికార్డు ఆధారంగా మానవత్వపు ప్రాతినిధ్యం వహించే మేధ ఎవరిది? అంటే హేగల్ మేధనా, మార్క్స్ మేధనా, అర్నెస్టు మేధనా లేక మరెవరి మేధను? అని కూడా నేను అడుగను. నేనడిగేది కేవలం ఒక్కటే. భూత భవిష్యత్ వర్తమాన కాలాల్లో ఏ తేదీ వరకు నమోదైన రికార్డు అద్దీన్‌ను నిర్మించటానికి తగినంత విష యాన్ని సమకూర్చగలదు అన్న విషయం. ఆ తేదీ తరువాత పుట్టిన వారయితే అదృష్టవంతులు. అంతకంటే ముందే గతించిన వారా? పాపం వారిగతి దైవాధీనం!

# నిరాశ కలిగించే విషయం

నేను ఇప్పటి వరకు చేసిన క్లుప్తమయిన సూచనలలో ఎలాంటి శాస్త్రీయమయిన హేతుబద్ధమయిన పొరపాటు చెయ్యలేదని నమ్ము తున్నాను; మానవునికి లభ్యమయిన సాధనాల, పరిశీలన దేన్నయితే నేను సూచించానో అది సరయినదే ఐతే ఒకటి మాత్రం నిర్ద్వంద్వంగా నమ్మవచ్చు. మానవుడు తనకోసం అపరిపక్వమయిన, అపసవ్యమైన, తాత్కాలికమయిన, స్థానికమయిన "దీన్"నయితే తయారు చేసుకో గలడు కాని "అద్దీన్"ను మాత్రం తయారు చేసుకోవటం అతనికి కొరుకుడు పడని సమస్య. ఇది గతంలోనూ అసాధ్యమయినదే నేడూ అసాధ్యమే, భవిష్యత్తులో కూడా దానిపట్ల ఆశ వదలుకోవలసిందే.

నాస్తికులు వాదిస్తున్నట్లు, మానవునికి మార్గం చూపే దేవుడే అసలు లేడనుకుంటే, మనిషి ఆత్మహత్య చేసుకోవడమే ఉత్తమం. ఏ బాటసారికైతే మార్గం చూపేవాడు లేడో, ఎవరివద్దనైతే మార్గం తెలుసు కునే సాధనాలూ లేవో అతని జీవితంలో కేవలం నిరాశ నిస్పృహలే తప్ప మిగిలేదేమిటి? అలాంటి వారిపట్ల సానుభూతిగల వారు ఇచ్చే సలహా ఏమయి వుంటుందీ— దారిలో ఉండే ఏ బండరాయితోనో కష్టాలన్నీ కడతేర్చుకో అని తప్ప.

నేటి సైంటిఫిక్ మరియు ఫిలాసఫికల్ నిర్ధారణకర్తల ఊహల రీత్యా అసలు దేవుడు ఉన్నాడు కాని ఆ దేవుడు మార్గదర్శకత్వాన్ని ఇచ్చే దైవం కాదు అని ఒప్పుకుంటే ఈ తర్కం మరీ విచారకరమై నది. ఏ దేవుడయితే ఈ విశాల విశ్వాన్ని సృష్టించి దాని ప్రగతి వికాసాలకు అవసరమని ఊహించదగ్గ హంగులన్నీ సమకూర్చాడో ఆ దేవుడే, మానవుని అత్యంత ప్రధానమయిన ఈ ఒక్క అవసరాన్ని సమకూర్చలేదా? అదే లేకుంటే మానవుని మనుగడే వ్యర్థమవుతుందే, ఆయన సృష్టించిన ప్రపంచంలో జీవించడమే ఓ బాధ అవుతుందే. బాధకు మించిన బాధను ఊహించడం కూడా కష్టమే.

మీరు నిరుపేదలు, దరిద్రులు, రోగులు, క్షతగాత్రులు, బాధితులు, పీడితులపై రోదిస్తున్నారెందుకు? మొత్తం మానవాళికై రోదించండి. అది అత్యంత నిస్సహాయస్థితిలో వదలి వెయ్యబడింది. అది మాటిమాటికీ తప్పుడు ప్రయోగాలు చేస్తూ వైఫల్యాన్ని పొందుతూ ఉంది. దెబ్బ తింటోంది, జారిపడుతోంది, పడిలేస్తోంది, మళ్ళీ ముందుకు నడుస్తోంది మళ్ళీ పడుతోంది. అలా పడినప్పుడల్లా దేశాలకు దేశాలే, జాతులకు జాతులే అంతమైపోతున్నాయి. పాపం— మానవునికి— ఈ దౌర్భాగ్యునికి తన జీవిత పరమార్థం కూడా తెలియదు. దేని కొరకు శ్రమించాలో, ఏ విధంగా శ్రమించాలో కూడా తెలియదు. ఇదంతా మనిషిని పుట్టించిన ఆ దేవుడు చూస్తున్నాడు. కాని పుట్టించడమే ఆయన వంతు, మార్గం మాత్రం చూపడు.

## ఒకే ఒక ఆశాకిరణం

ఈ చిత్రానికి పూర్తిగా భిన్నమైన ఇంకో చిత్రాన్ని మన ముందు ఉంచుతుంది ఖుర్‌ఆన్, దాని ప్రకారం దేవుడు కేవలం సృష్టించే వాడే కాదు మార్గం చూపే వాడు కూడా. ఆయనే సకల చరాచర సృష్టి జాలం మనుగడ కొరకు దాని ప్రకృతికి సరిపోయే మార్గాన్ని చూపించాడు.

> ఎవరైతే ప్రతి పదార్థానికి దాని స్వరూపాన్ని ప్రసాదించాడో తిరిగి దానికి మార్గం చూపాడో— (తాహా-50)

దీనికి రుజువు కావాలంటే, మీరు ఏ చీమనో, ఏ ఈగనో, ఏ సాలె పురుగునో పట్టుకొని పరిశీలించండి.

ఆ దేవుడే మానవునికి కూడా మార్గం చూపేవాడు. కాబట్టి మానవుడు అనుసరించవలసిన సరయిన మార్గం ఒక్కటే, తలబిరుసు తనాన్ని వదిలేసి, ఆ దేవుని సమక్షంలో తలవంచడం, ఆయన ఏ

సమగ్ర సంపూర్ణ జీవన వ్యవస్థను లేక "అద్దీన్"ని తన ప్రవక్తల ద్వారా మానవాళికి ప్రబోధించాడో దాన్ని అనుసరించడం.

ఒకవైపు మానవ శక్తులు మరియు అతనికి లభ్యమైన సాధనాల పరిశీలనవల్ల లభ్యమయ్యే ఫలితం ఉంది. ఇంకోవైపు ఖుర్ఆన్ చేసే ఈ వాదనా ఉంది. ఈ రెంటిలో ఏదో ఒక దాన్ని స్వీకరించడం తప్ప మనకు గత్యంతరం లేదు. ఖుర్ఆన్ వాదాన్నయినా నమ్మాలి లేదా ఎలాంటి ఆశాకిరణం కానరాని నిరాశా నిస్పృహల గాఢాంధకారంలోపడి నామరూపాల్లేకుండా పోవాలి. "అద్దీన్"ను పొందడానికి రెండు రకాల సాధనాలు మన వద్ద ఉండి వాటిలో మనం దేన్ని స్వీకరించాలి? అన్నది కాదు ప్రశ్న. అసలు పరిస్థితి ఏమిటంటే అద్దీన్ లభించే మార్గం ఏదయితే ఉందో అది కేవలం ఒక్కటే! అందువల్ల ఇప్పుడు ఎదురయ్యే ప్రశ్న ఏమిటంటే, ఈ ఏకైక సాధనం ఆధారంగా మన సమస్యను పరిష్కరించుకుందామా? లేక దాని సహకారాన్ని కాదని చీకట్లోనే తట్టాడుతూ తిరుగుదామా?? ఇదే ప్రస్తుత ముఖ్య అంశం.

## ఖుర్ఆన్ నిదర్శనాలు

ఇప్పటివరకు నేను చూపిన ఆధారాలు సూచించేదేమంటే, మన ధ్యేయం కోసం ఖుర్ఆన్ చేసే వాదనను స్వీకరించడం తప్ప వేరే మార్గం లేదు. ఇంకోవిధంగా చెప్పాలంటే ఇది బలవంత బ్రాహ్మణార్థం లాంటిదన్నమాట! కాని ఖుర్ఆన్ చేసే ఈ వాదనకు అది చూపే ఆధారాలు ఇంతకంటే ఎంతో ఉన్నతంగా ఉన్నాయి. ఎందుకంటే అవి మనల్ని గతిలేక ముస్లిములవడం కాకుండా పూర్తి ఇష్టంతో సంతోషంగా ముస్లిములయ్యేందుకు సమాయత్తపరుస్తాయి. ఇది చూపే అనేక నిదర్శనాల్లో నాలుగు చాలా బలవత్తరమయినవి. వాటినే అది మాటిమాటికీ పునరుక్తం చేస్తూంది.

1. మానవునికి ఇస్లామ్ ఒక్కటే సరయిన జీవిత విధానం. ఎందుకంటే ఇదే అసలు యదార్థానికనుగుణంగా ఉంది. ఇదికాక మరే ఇతర వైఖరి ఐనా అది వాస్తవ విరుద్ధమయింది.

> ఇక ఈ ప్రజలు అల్లాహ్ విధేయతా విధానాన్ని (అల్లాహ్ ధర్మం) వదలిపెట్టి, వేరే ఏదైనా విధానాన్ని కోరుతున్నారా ఏమిటి? వాస్తవంలో భూమ్యాకాశాల్లో ఉన్న సకల వస్తువులూ ఇష్టమున్నా లేకపోయినా అల్లాహ్ విధేయతకు కట్టుబడి (ముస్లిమ్) ఉన్నాయ్. ఆయన వైపుకే అంతా మరలిపోవలసివుంది. (దివ్యఖుర్ఆన్–3:83)

2. మానవునికి ఇదొక్కటే సరి అయిన జీవన మార్గం. ఎందుకంటే ఇదే పరమ సత్యం, న్యాయం రీత్యా ఇది తప్ప మరో మార్గం సరైనది కాజాలదు.

> వాస్తవంగా అల్లాహ్‌యే మీ ప్రభువు, ఆయన ఆకాశాలను, భూమిని ఆరు దినాల్లో సృష్టించాడు. తరువాత తన రాజ్య పీఠాన్ని అలంకరించాడు; రాత్రిని పగలుపై కప్పేస్తాడు; తరువాత పగలు రాత్రి వెంట పరుగుతీస్తూ ఉంటుంది; ఇంకా సూర్యుణ్ని, చంద్రుణ్ని, నక్షత్రాలను పుట్టించాడు. అన్నీ ఆయన ఆజ్ఞకు కట్టుబడి ఉన్నాయి తెలుసుకోండి, ఆయనదే సృష్టి, ఆయనదే అధికారం. (దివ్య ఖుర్ఆన్–7;54)

3. మానవుడికి ఈ వైఖరే సరి అయినది. ఎందుకంటే సకల యదార్థాల సరయిన జ్ఞానం కేవలం దైవానికే ఉంది. ఎలాంటి లోపం లేని మార్గదర్శకత్వం కేవలం ఆయన ఒక్కనివల్లే సాధ్యం.

> భూమ్యాకాశాల్లోని ఏ వస్తువూ అల్లాహ్‌కు గోప్యంగా లేదు (దివ్య ఖుర్ఆన్–3:5

ప్రజల ముందు ఉన్న దాన్నీ ఆయన ఎరుగు; వారికి గుప్తంగా ఉన్నదీ ఆయనకు తెలుసు.
(దివ్య ఖుర్ఆన్-2:255)

4. మానవునికి ఇదొక్కటే ఋజు మార్గం. ఎందువల్లనంటే ఇది లేకుండా న్యాయం అన్నది సాధ్యపడదు. ఇది తప్ప మరే మార్గాన్ని మనిషి అనుసరించినా చివరికి అది అత్యాచారం వైపుకే పోతుంది.

అల్లాహ్ విధించిన హద్దుల్ని అతిక్రమించేవారే దుర్మార్గులు. (దివ్య ఖుర్ఆన్:2:229)

అల్లాహ్ అవతరింప జేసిన శాసనం ప్రకారం ఎవరైతే తీర్పు చెయ్యరో వారే దుర్మార్గులు.
(దివ్య ఖుర్ఆన్-5;45)

ఈ నిదర్శనాల ప్రకారం, బుద్ధిగల ఏ మనిషికైనా అల్లాహ్ సమక్షంలో తలవంచడం, మార్గదర్శకత్వం కొరకు ఆయన్నే ఆశ్రయించడం అనివార్యం.

## ఏది దైవ మార్గదర్శకత్వం

చర్చను ముందుకు కొనసాగించే ముందు ఒక ప్రశ్నకు సమాధానం వెదకడం ముఖ్యం. ఈ ప్రశ్న ఈ దశలో ప్రతివారిలోనూ తప్పక ఉద్భవిస్తుంది. నేను పరిశోధన జరిపేటప్పుడు స్వయంగా నాలో కూడా ఉత్పన్నమయింది. అదేమిటంటే, ఇది దైవం తరఫున అందజెయ్యబడిన ధర్మం అని చెప్పే ప్రతి మనిషి మాటను నమ్మాలా? అలా కాకపోతే మానవ కల్పిత ధర్మం మరియు దైవ బోధన ప్రకారం రూపొందిన ధర్మాల్లో వ్యత్యాసం కనిపెట్టడానికి మనవద్ద ఏ ప్రమాణం ఉంది? దీని సమాధానం కోసం చాలా విస్తృతమయిన పరిశోధనాత్మక చర్చ అవసరమైనా నేను ఇక్కడ క్లుప్తంగా, సూచనాప్రాయంగా

నాలుగు పెద్ద ప్రమాణాలను పేర్కొంటున్నాను. ఇవి మానవ ఆలో చనాసరళి నుండి దైవిక ఆలోచనాసరళిని వేరుచేసి చూపగలవు.

మానవ ఆలోచన యొక్క ప్రథమ ముఖ్యమైన ప్రత్యేకత ఏమిటంటే ఈ ఆలోచనలో, లోపభూయిష్టమయిన, పరిమితమైన జ్ఞానం యొక్క ప్రభావం అనివార్యంగా గోచరిస్తుంది. దీనికి భిన్నంగా దైవం అందజేసే ఆలోచనా విధానంలో అపారజ్ఞానం, నిజమయిన జ్ఞానం యొక్క గొప్పదనం కొట్టవచ్చినట్లు కానవస్తుంది. దైవదత్తమయిన విషయంలో ఏ కాలంలోనూ నిరూపితమైన శాస్త్రీయ యదార్థానికి భిన్నమైన ఏ విషయం ఉండదు. అలాగే అందులో "దీన్ని రూపొందించిన దాని దృష్టి నుండి యదార్థానికి సంబంధించిన ఫలానా విషయం కనుమరుగయింది." అని నిరూపించగలిగిన ఏ విషయం కూడా ఉండదు. అయితే పరిశోధనకు సంబంధించిన ఈ ప్రమాణాన్ని వినియోగించేటప్పుడు "జ్ఞానం" మరియు "వైజ్ఞానిక ఊహ" "వైజ్ఞానిక సిద్ధాంతం" అనే వాటి మధ్య తేడాను తెలుసు కోవాలి. ఒకనాటి వైజ్ఞానిక ఊహల్ని లేక వైజ్ఞానిక సిద్ధాంతాలను అవే మస్తిష్కాలను ఆవరించి ఉండడం మూలాన వాటినే పొరపాటున అసలు "జ్ఞానం" అనుకోవడం జరుగుతుంది. వాస్తవానికి ఇవి నిజ మయ్యే అవకాశాలు ఎంత మెరుగ్గా ఉంటే తప్పుగా నిరూపించబడే అవకాశాలూ అంతే మెరుగ్గా ఉంటాయి. చివరికి అసలయిన జ్ఞానం అని నిరూపితమయిన సిద్ధాంతాలు ఊహలు వైజ్ఞానిక చరిత్రలోనే బహు అరుదు.

మానవ ఆలోచనాసరళి యొక్క రెండవ గొప్ప బలహీనత, దృష్టికోణం యొక్క సంకుచితత్వం. దీనికి భిన్నంగా దైవిక ఆలో చనలో అత్యంత విస్తృత దృక్కోణం కానవస్తుంది. దైవం ప్రసాదించే ఆలోచన ద్వారా వెలువడే ఏ విషయాన్నయినా పరిశీలిస్తే, దాన్ని ప్రబోధించేవాడు అనాది నుండి అనంతం చూస్తున్నవాడని, ఆయన విశ్వాన్నంతటినీ చూస్తున్నాడని, సకల యదార్థాలను ఒకే దృష్టితో గమనిస్తున్నాడని తెలుస్తుంది. ఆ ఆలోచన ముందు గొప్ప గొప్ప

తార్కికులు, ఆలోచనాపరులు, తత్వవేత్తల ఆలోచనలు కూడా పసి పిల్లల ఆలోచనల్లాంటివిగా అగుపిస్తాయి.

మానవ ఆలోచనాసరళి యొక్క మూడవ ప్రత్యేక బలహీనత ఏమంటే అతనిలోని విజ్ఞతా వివేకాలు అప్పుడప్పుడు అతని భావోద్రేకాలతో, కోరికలతో ఏదో ఒక చోట సంధి చేసుకున్నట్లు, రాజీపడినట్లు తప్పక కనిపిస్తుంది. దీనికి భిన్నంగా దైవిక ఆలోచనాసరళిలో నిష్పాక్షికమయిన వివేచన స్వచ్ఛమయిన విజ్ఞత ఎంతో గొప్పగా ప్రస్ఫుటంగా కానవస్తాయి. దాని ఆదేశాల్లో ఎక్కడా భావావేశాల ప్రభావాన్ని చూడలేము.

ఇక మానవ ఆలోచనాసరళి యొక్క మరో బలహీనత ఏమంటే, జీవన వ్యవస్థను స్వయంగా అదే రూపొందిస్తుంది. అందులో పక్షపాతం, మానవుల మధ్య అసమంజసమయిన భేదభావం, మానవుల్లో నిర్హేతుకమయిన ప్రాధాన్యత, ఒకరికి మరొకరిపై ఆధిక్యత తప్పక అగుపడుతాయి. ఎందుకంటే ప్రతి మనిషిలో కొన్ని సొంత అభిరుచులు ఉంటాయి. అవి కొందరివరకే పరిమితమయి వుంటాయి. మరికొందరితో ఎలాంటి సంబంధం కలిగి ఉండవు. దీనికి భిన్నంగా దైవిక ఆలోచనాసరళి నుండి పుట్టిన జీవన వ్యవస్థ ఇలాంటి ఏ అంశమూ లేకుండా పరిశుద్ధంగా ఉంటుంది.

దైవదత్తమయిన జీవనవ్యవస్థగా "అద్దీన్" అని ప్రకటించుకునే ప్రతి వ్యవస్థను ఈ ప్రమాణాలపై పరీక్షించండి. ఒకవేళ మానవ ఆలోచనా సరళికి సంబంధించిన "ఈ ప్రత్యేకతలన్నింటి"కీ అది దూరంగా ఉన్నట్లయితే, పైగా ఇంతకు ముందు అద్దీన్ యొక్క అవసరం గురించి పరిశీలిస్తూ మనం గమనించిన ప్రత్యేకతలు, సమగ్రత, విశ్వజనీనత కూడా కలిగిఉంటే, దాన్ని మీరు స్వీకరించటంలో తటపటాయించే కారణం ఏదీ కానరావడం లేదు.

# విశ్వాసం కోరేదేమిటి?

ఇప్పుడు నేను నా ఉపన్యాసం యొక్క మౌలిక ప్రశ్నల్లోని చివరి దాన్ని గురించి చర్చిస్తాను. అదేమిటంటే ఒకవేళ ఖుర్ఆన్ యొక్క ఈ వాదనను స్వీకరించి, ఈ అద్దీన్ (జీవన వ్యవస్థ)ను అల్లాహ్ యే ప్రసాదించాడని మనిషి మనస్ఫూర్తిగా విశ్వసిస్తే ఆ విశ్వాసం, ఆ స్వీకారం మన నుండి కోరేదేమిటి?

నేను ప్రారంభంలోనే ఇస్లామ్ అంటే వంగిపోవడం, లొంగి పోవడం, స్వయం సమర్పణ చేసుకోవడమని మనవి చేశాను ఈ వంగడం, లొంగడం, స్వయం సమర్పణలతో పాటు సొంత ఆలోచనలు, సొంత అధికారం, ఆలోచన ఆచరణల విశృంఖలత్వానికి పొంతన కుదరదు. మీరు ఏ దీన్‌ని విశ్వసించినా ఆ 'దీన్'కే మీ పూర్తి వ్యక్తిత్వాన్ని అప్పగించవలసి వస్తుంది. మీకు సంబంధించిన ఏ విషయాన్నయినా మీరు ఈ దీన్ అనుసరణ నుండి మినహాయించ లేరు. "విశ్వాసం" కోరేదేమంటే ఆ ధర్మం మీ మనసుకు, మస్తిష్కానికీ ధర్మం కాగలగాలి అది మీ కంటికీ, చెవికీ ధర్మం కాగలగాలి, అది మీ కాళ్ళు చేతుల ధర్మం కాగలగాలి, అది కడుపుకు, కాయానికీ ధర్మం కాగలగాలి, అది మీ కలానికీ మీ నోటికీ ధర్మం కాగలగాలి, మీ కాలం, మీ కష్టం కూడా ఆ దీన్‌కే లోబడి ఉండాలి. మీ కృషికి మీ ప్రయత్నాలకు అదే ధర్మమై ఉండాలి, మీ రాగద్వేషాల ధర్మమూ అదే కాగలగాలి, అది మీ మైత్రీ శత్రుత్వాల ధర్మమయి ఉండాలి. ఒక్క మాటలో చెప్పాలంటే మొత్తానికి మీ వ్యక్తిత్వంలోని ఏ అంశం, ఏ రంగం కూడా మీరు నమ్మిన ఆ దీన్‌కు వెలుపలగా వేరుగా ఉండకూడదు. ఏ విషయానికి ఏ మేరకు, ఏ రూపంలో మీరు దీన్ పరిధి నుండి మినహాయింపునిస్తారో ఆ మేరకు మీ విశ్వాస ప్రకటనలో కల్తీ ఉందని, కపటం నిండి ఉందని భావం.

(సత్యధర్మం–3)

తన జీవితంలో ఎలాంటి అసత్యం చోటు చేసుకోకుండా ఇతోధికంగా ప్రయత్నించే బాధ్యత ప్రతి సత్య ప్రేమికుడయిన వ్యక్తిపైనా ఉంది.

నేను మొదటనే మనవి చేసినట్లు మానవ జీవితం అవిభాజ్యమైన ఏకాంకం. దాన్ని వివిధ రంగాల్లో విభజించలేం. కాబట్టి మానవుని జీవితాన్నంతటికీ ఒకే ఒక దీన్ (జీవన వ్యవస్థ) అవసరం. రెండేసి మూడేసి వ్యవస్థలను ఒకేసారి అనుసరించటం అంటే విశ్వాసంలో డోలాయమానావస్థ ఉందనీ, హేతువు చేసే నిర్ణయాల్లో నిలకడ లేదని మాత్రమే ఋజువవుతుంది. మీరు యదార్థంగా ఒక ధర్మాన్ని లేక జీవన వ్యవస్థను లేక దీన్‌ను అదే "అద్దీన్" అని మన:పూర్వకంగా నమ్మినప్పుడు, అదే మీ జీవితంలోని అన్ని రంగాల దీన్ అయి వుండాలి, ఒకవేళ అది మీ వ్యక్తిగత జీవితానికి దీన్ కాగలిగితే అది మీ గృహ జీవితపు దీన్ ఎందుకు కాకూడదు? అది మీ సంతాన శిక్షణకు, మీ విద్య, విద్యాలయాలకు, మీ వ్యాపారవాణిజ్యాలకు, మీ బ్రతుకు తెరువుకు, మీ సాంఘిక, జాతీయ జీవనానికి, మీ నాగరిక, రాజకీయాలకు, మీ కళ, సాహిత్యాలకు కూడా అది దీన్ లేక ధర్మం లేక వ్యవస్థ ఎందుకు కాకూడదు? ఒక్కొక్క ముత్యం విడిగా ఉన్నప్పుడు ముత్యమే ఐతే అలాంటి ముత్యాలను కలిపి సంఘటితపరచినప్పుడు అవి గులకరాళ్ళు అవుతాయా? అదేవిధంగా వ్యక్తిగతంగా మాత్రం ప్రతి ఒక్కరం ఒక జీవన మార్గాన్ని అవలంబించవచ్చు. కాని మన జీవితాన్ని సంఘటితపరచినప్పుడు ఆ సంఘటిత జీవితానికి సంబంధించిన ఏ రంగమైనా ఆ ధర్మం నుండి మినహాయించబడాలి! అనే విషయం నా మస్తిష్కానికేవిధంగానూ ఎక్కలేక పోతోంది.

వీటన్నిటికంటే ముఖ్యముగా విశ్వాసం మన నుండి కోరేదేమిటంటే ఏ జీవన వ్యవస్థను మీరు అద్దీన్ అని విశ్వసిస్తున్నారో దాని ఫలాలు ప్రయోజనాల ద్వారా మానవాళికంతటికీ మేలు కలుగజేసే కృషి జరపాలి. ఈ ధర్మమే, ఈ అద్దీన్ ప్రపంచం మొత్తానికి అద్దీన్‌గా రూపొందేందుకు మీ ప్రయత్నాలన్నీ కేంద్రీకృతం కాగల

గాలి. ఏ విధంగానయితే "సత్యం" అన్నిటిపై ఆధిక్యతను పొందే స్వభావం కలిగివుందో అదే విధంగా ఈ సత్యాన్ని అనుసరించేవారు సయితం సత్యాన్ని గ్రహించిన తరువాత దానికి అసత్యవాదంపై ఆధిక్యత కలుగజేయనంతవరకు ప్రశాంతంగా విశ్రమించలేరు. అసత్యం అన్నివైపుల నుండి భూమినీ, భూవాసులను ఆవరిస్తుండగా చూచినప్పటికీ ఈ దృశ్యం ఏ వ్యక్తిలోనయితే ఎలాంటి సంచలనాన్ని, బాధను, ఆవేదనను కలుగజెయ్యదో అతనిలో సత్యం పట్ల ప్రేమ ఉన్నా అది నిద్రాణమయి ఉందన్నమాట. ఈ నిద్రావస్థ చివరికి మరణావస్థగా రూపొందకుండా అతడు జాగ్రత్తపడడం శ్రేయస్కరం.



దైవం మానవాళికై పంపిన మార్గదర్శకత్వం

నిత్యం ఒక్కటే! సత్యం ఒక్కటే!! ధర్మం ఒక్కటే!!!

ఏ దేశంలో, ఏ కాలంలో, ఏ భాషలో, ఏ జాతిలో నయినా దానికి ఏ పేరున్నా దాని గుణం రీత్యా "సత్యధర్మం" ఒక్కటే— అదే ఇస్లాం.

ఇస్లాం బోధనలు సహేతుకమయినవి, సమంజసమయినవి— అర్థం చేసుకోడానికి చదవండి:

# ఇదియే ఇస్లాం

రు. 5/- మేలు ప్రతి 10/-

---

ఇస్లాం నైతిక వ్యవస్థకు పునాదులయిన ఆరాధనా రీతులు వాటి వివరాలను అర్థం చేసుకోడానికి చదవండి:

# ఇస్లాం శిక్షణ

రు. 7-00

తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

లక్కడ్ కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002